## గంటల పంచాంగం

ఖర సం॥ భాద్రపద బ॥ దశమి
1951 సం॥ సెప్టెంబరు 25 మంగళవారం
మం॥ దశమి రా 8-43 పునర్వ 4-40
వర్జ్యం రా 1-33 ల 3-18 కు.
బ॥ ఏకాదశి సెప్టెంబరు 26 బుధవారం
బు॥ ఏకాదశి తె 5-37 పుష్య సా 7-16
వర్జ్యం లేదు.


# ఆంధ్రపత్రిక

ఒరులేయవి యొనరించిన నరవర, యప్రియము తన మనంబున కగు దా నొరులకు నవిసేయకునికి పరాయణము పరమధర్మపథములకెల్లన్. (మహాభారతము)

ఖర సం॥ భాద్రపద బ॥ దశమి
మంగళవారం


## బ్రిటన్ వైఖరి

పర్షియా ప్రధానమంత్రి ప్రతిపాదనలను నిరాకరించడంలో బ్రిటిష్ ప్రభుత్వం కించిత్తు రాజనీతిజ్ఞతను కూడా చూపలేదని క్రమక్రమంగా స్పష్టమౌతున్నది. ప్రలత్త కనిభీష్మించుకు కూర్చోవడంవల్ల పని సానుకూలం గాదని అటు బ్రిటన్, ఇటు పర్షియా గ్రహించిన వేళ అభిప్రాయం హారిమన్ దౌత్యంవల్ల కల్గింది. ఆంగ్లో ఇరానియన్ నూనె కంపెనీ లాభాలను చెరిసగంగా పంచుకోవడానికి బ్రిటన్, పర్షియా ప్రభుత్వాలు దాదాపు అంగీకరించినవి. నూనె కంపెనీకి ఎవరు మేనేజరుగా ఉండాలన్న విషయంమీద అంగీకారం కుదరక నే హారిమన్ దౌత్యం విఫలమైనట్లు కన్పించింది.

పర్షియా ప్రధాన మంత్రి ఇప్పుడు కొత్తగా ప్రతిపాదనలను చేయక పోయినా తిరిగి సంప్రతింపులు ప్రారంభించడానికి తన ప్రభుత్వం సుముఖంగా ఉందని ప్రకటించడంవల్ల వివాదానికి ఎక్కువ అవకాశం ఉందని బ్రిటిష్ ప్రభుత్వం గ్రహించి యుండవలసింది. అమెరికా అధ్యక్షుని ప్రతినిధిద్వారా పంపదల్చుకున్న శ్రీముఖానికి, పర్షియా స్వయంగా బ్రిటన్‌కు పంపిన సందేశానికీ ఒక ప్రధాన విషయంలో చాలా తేడా ఉంది. రెండు వారాల్లోపున తిరిగి సంప్రతింపులు ప్రారంభించడానికి బ్రిటన్ అంగీకరించక పోతే నూనె కంపెనీకి చెందిన బ్రిటిష్ ఉద్యోగుల సంసర్గ్నే దేశంనుంచి వెళ్లగొట్టడం జరుగుతుందని ప్రధాని మొసాదిక్ మొదట ప్రకటించాడు. ఇప్పుడు ఆ బెదిరింపును ఉపసంహరించుకున్నాడు. అంతేగాక పర్షియా రాజు స్వయంగా బ్రిటన్‌కు ఈ సందేశం పంపినట్లు కన్పిస్తుంది.

పరిస్థితులు ఇంత అనుకూలంగా మారినప్పటికీ బ్రిటన్ తన వైఖర్ని మార్చుకోక పోవడం శోచనీయం. బ్రిటన్ అవలంబించిన ఈ వైఖరి ఫలితాలు ఎలావుంటాయో గ్రహించడానికి తగిన సంఘటనలు ఉన్నాయి. ప్రారంభమైనవి. పర్షియా ప్రభుత్వంతో ప్రత్యేక వస్తునూరకపు ఒడంబడిక కుదుర్చుకోడానికి రష్యా అప్పుడే రాయబారాలు ప్రారంభించినట్లు తెలుస్తున్నది. ఆ ఒడంబడికలో పర్షియా సోవియట్ కూటమికి చెందిన రాజ్యాలకే నూనె సప్లయి చేయాలన్నది ఒక షరతు. ఇటు పర్షియాతో ఒడంబడిక చేసుకొనేందుకు ప్రయత్నిస్తూ, అటు ఈజిప్టుతో కూడ ఒక వాణిజ్య ఒడంబడికను కుదుర్చుకోవడానికి ఏర్పాట్లు జరుగుతున్నవి. పీఐన్నింట్ని బట్టి మధ్య, సమీపప్రాచ్యరాజ్యాలన్నీ కూడా సోవియట్ కూటమి ప్రాబల్యంక్రిందికి వెళ్లే అవకాశం ఎక్కువగా ఉన్నట్లు కన్పిస్తున్నది. ఈ పరిణామానికి బ్రిటన్, అమెరికాల విధానమే కారణమవుతున్నది. ఇప్పటికైనా బ్రిటన్, అమెరికాలు ఈజిప్టు, పర్షియాల విషయంలో ప్రస్తుత వైఖర్ని మార్చుకొని పాత ఒడంబడికల స్థానే కొత్త ఒడంబడికలు చేసుకొనకపోతే ఇతరరకమైన ఒడంబడికలు ఎన్ని ఉన్నా ప్రయోజనం ఉండదు.

## 'ప్రజా సేవా తత్పరులే శాసనసభ్యులు కావాలి'

### రఫీ అహమ్మద్ కిద్వాయ్ ప్రసంగం

లూధియానా, సెప్టెంబరు 23: 'దేశాన్ని విపత్తునుండి రక్షించాలంటే ప్రజలు సమర్థులను, ప్రజా సేవాతత్పరులను శాసన సభలకు పంపాలి. పండిత నెహ్రూగారి కాంగ్రెసు అధ్యక్షుడుగా వున్నంత మాత్రంచేత కాంగ్రెసుకు వోటివ్వడం అత్యవసరం అవుతుంది' అని నిన్న యిక్కడకు వచ్చిన రఫీ అహమ్మద్ కిద్వాయ్‌గారు ఒక సభలో ఉపన్యసిస్తూ చెప్పారు.

'స్వాతంత్ర్యం చేకూరడంతో దేశం ధన ధాన్య సంపూర్ణంగా వుంటుందని మనం ఆశించాము. కాని స్వాతంత్ర్యం వచ్చిం తరువాత దేశస్థితి మరింత అధ్వాన్నమైంది. అన్ని వస్తువుల ధరలు ఆకాశం అంటుతున్నవి. ప్రజల ఆదాయాలు తగ్గినవి. పండిత నెహ్రూ నాయకత్వంలో విశ్వాసం లేకపోవడంచేత మేము కాంగ్రెసునుండి రాజీనామా యివ్వలేదు. కాంగ్రెసు తన సిద్ధాంతాలను ఆశయాలను భిన్నంగా చేస్తుండడంచేత మేము కాంగ్రెసు నుండి వైదొలగాము. ప్రధాని యెడలను, ఆయన ఆశయముల యెడలను మాకు పరమ పూజ్యభావం గలదు. గాంధి తత్వంలో మాకు సంపూర్ణమైన నమ్మకం కలదు. కాని జాతి జనకుని ఆశయాలను కాళ్ళక్రింద త్రొక్కి వేయడము, కాంగ్రెసువాదులు దేశానికి ఏదో కొంత సేవ చేయకుండా స్వార్థానికి పాకులాడడము మాకు దుస్సహమైంది' అని కిద్వాయ్‌గారన్నారు.

తిరిగి మీరు కాంగ్రెసులో చేరుతారా? అని అడుగగా కిద్వాయ్‌గారు ఇలా అన్నారు: '30 ఏండ్లనుంచీ నేను కాంగ్రెసులో వున్నాను. నా కార్యక్రమము, కాంగ్రెసు కార్యక్రమము ఒక్కటే అవడంచేత నేను కాంగ్రెసులో అంతర్భాగమైనాను. కాంగ్రెసు పునరుద్ధరణ జరగాలి. కాని అట్టి అవకాశాలు కనిపించడంలేదు. కాంగ్రెసు పునరుద్ధరణ జరిగినట్లయితే నేను తిరిగి కాంగ్రెసులో తప్పక చేరుతాను."

### పెప్సూ వర్కర్లతో గోష్ఠి

పెప్సూ ప్రముఖ వర్కర్ల నేకులు కిద్వాయ్ గారిని కలిసికొని పెప్సూలో ప్రజాపార్టీని యేర్పరిచే విషయమై చర్చలు జరిపారు.

## జిన్నాసోదరి రేడియో ప్రసంగ పాఠం

### తిరిగి ప్రసారానికి పాక్ రేడియో సమ్మతి

కరాచీ, సెప్టెంబరు 23: సెప్టెంబరు 11 వ తేదీన జిన్నా వర్ధంతి సందర్భంలో ఆయన సోదరి ఫతిమాజిన్నా చేసిన ప్రసంగాన్ని తిరిగి పూర్తిగా ప్రసారం చేయాలని ప్రజలు కోరిన కోరికను రేడియో పాకిస్థాన్ లొంగి వచ్చింది. ఆ ప్రసంగాన్ని పూర్తిగా రేపు రాత్రి ప్రసారం చేయుటానికి అంగీకరించింది.

ఆ ప్రసంగంలో కొన్ని భాగాలు ప్రజలకు వినిపించకుండా ఆటంకాలు వచ్చినవి. ఇవి యంత్రాలు చెడిపోవటంవల్ల జరిగిందని రేడియో అధికారులు అన్నారు. కాని ఫతిమాజిన్నా, మరికొన్ని పత్రికలు మాత్రం ఇది కావాలని చేసిన కత్తిరింపేనని ఆరోపించారు. దానిమీదట కొంత వాదోపవాదాలు జరిగినమీదట అధికారులు సమ్మతించారు.

ఈ సంఘటనపై పాకిస్థాన్ పత్రికలు విశేష ప్రాధాన్యతను ఇచ్చినవి. జిన్నా సోదరికే పాకిస్థాన్ ప్రజలకు తన అభిప్రాయాలు తెలియచేసే అవకాశం లేకపోతే, ఇంకా సాధారణ ప్రజలకు ఉండే స్వేచ్ఛ ఏపాటిది అని ఆ పత్రికలు ప్రశ్నించినవి. ఈ సంఘటనవల్ల లియాకతాలీ ప్రభుత్వ ప్రజాస్వామ్య నిజస్వరూపం బయటపడినట్లున్నదనీ, జాతిని వారినిపారించి రక్షించి ప్రజాస్వామ్యాన్ని పునరుద్ధరించడానికి యువకులందరూ సిద్ధంగా వున్నారనీ ఆ పత్రికలు ... ప్రకటన చేశాడు.

# మౌంట్ బాటెన్ దౌత్యం....(3)

# నిజాం నవాబు దురాలోచన: కాశ్మీర్ సమస్యతో ముడి

## ఇత్తేహాదుల్ ముస్లిమీన్ అట్టహాసం

ఏదో ఒక విధంగా ప్రజాభిప్రాయాన్ని సేకరించి ఇండియాలోనో, పాకిస్థాన్‌లోనో 1947 ఆగస్టు 15 లోపుగానే చేరిపోవలసిందని కాశ్మీర్ మహారాజాకు లార్డ్ మౌంట్‌బాటెన్ హితవు చెప్పాడు. కాని మహారాజా మొండకొడిగా ప్రవర్తించడం మానలేదు. మహారాజా ఏదో ఒక నిర్ణయానికి వచ్చినట్లయితే, ఆ నిర్ణయాన్ని భారత ప్రభుత్వం వ్యతిరేకంగా పరిగణించదని సర్దార్ పటేల్ సైతం మౌంట్‌బాటెన్ ద్వారా మహారాజాకు చెప్పి చూశారు. చివరకు విసుగువుట్టి కాశ్మీర్‌కు ఏదైనా ఉపద్రవం వాటిల్లితే దానికి పూర్తిగా మీ మాంద్యమే కారణమవుతుంది సుమా అని మౌంట్‌బాటెన్ మహారాజాను గట్టిగా మందలించడం జరిగింది.

కాశ్మీర్ వ్యవహారం ఈ విధంగావుంటే, హైదరాబాద్ విషయంలో నిజాం నవాబు కూడా దురాలోచనకు దిగాడు. కాశ్మీర్ వ్యవహారం ఏవిధంగా పరిణమిస్తుందో చూద్దామని కాలయాపన చేయడం మొదలుపెట్టాడు. ఈ సంఘటన లన్నిటిని పూసగుచ్చినట్లు అలాన్ కాంబెల్ జాన్సన్ ఈ వ్యాసంలో పొందుపరిచాడు.

ప్రభుత్వ భవనం: న్యూఢిల్లీ, సోమవారం, 8, నవంబరు 1947.

శనివారం నాటి లాహోరు సమావేశంలో మౌంట్‌బాటెన్ జిన్నాకు సూచించివచ్చిన ప్రకారంగానే, పండిత నెహ్రూగూడా, కాశ్మీర్‌లో ఐక్యరాజ్యసమితి ఆధ్వర్యంలో జనవాక్య నిర్ధారణకు ఆమోదిస్తూ రేడియోలో ఒక పెద్ద ఉపన్యాసం ఇచ్చారు. ఆ ఉపన్యాసం అంతా సంయమనంతో కూడినదై, హేతువాద విహితమైనదై, సమ్యగ్వాద భరితమైవుంది. అయితే జిన్నా అభ్యంతరం చెప్పతున్నది జనవాక్య నిర్ధారణనుగూర్చి కాదన్న విషయం లాహోరులోనే తేలిపోయింది. కాశ్మీర్‌లో ఇండియా సైన్యాలు వుండేందుకు వీలులేదు. అవి ఉపసంహృతాలు కావాలి. అట్లా చేయని పక్షంలో కాశ్మీర్‌లో నిష్పక్షికంగా జనవాక్యాన్ని నిర్ధరించడం కష్టమౌతుంది. జిన్నా వాదం ఈ విధంగా వుంది. అది శీతకాలం కాబట్టి కాశ్మీర్ లో వెంటనే జనవాక్యాన్ని గ్రహించడంపడదని నెహ్రూ, పటేల్లు ఇద్దరు గూడా భావించారు. అదీకాక, ఇందుకు తగిన ఏర్పాట్లు చేయడానికి గూడా కొంతకాలం ఎట్లాగూ పడుతుంది. కాని ఇదంతా మౌంట్‌బాటెన్‌కు నచ్చలేదు. కాశ్మీర్ విషయమై ఎట్టి ఆలోచనలు చేసినా, అందులో కాలాదాసీన్యానికి తావుండరాదని, దీర్ఘకాలం అంతటి విస్తృతమైన యుద్ధరంగాన్ని నిలిపివుంచడం అంటే సైనికంగా ఎంతటి కష్టమో ఆలోచించవలసిందని, ఆయన ఒత్తిడిచేస్తూ వచ్చారు.

### మహారాజాకు మౌంట్‌బాటన్ సలహా

ప్రభుత్వ భవనం: న్యూఢిల్లీ, సోమవారం, 10, నవంబరు 1947.

నేను లండన్‌నుంచి తిరిగి వచ్చిన దగ్గరనుంచి ఇంతవరకు నడిచిన వ్యవహారకాండనంతా మననం చేసుకొని అందులో అతి ముఖ్యమైన అంశాలను ఒక జాబితాగా తయారుచేశాను. అది ఈ విధంగా తయారైంది.

"హైదరాబాదు, జునాఘడ్, కాశ్మీర్ సంస్థానాల విషయమై ఫలానా విధంగా వ్యవహరిస్తే బాగుంటుందని చెప్పడం అంత తేలికగా కన్పించడంలేదు. మరి కాశ్మీర్‌లో యుద్ధపరిస్థితి ఎట్లావున్నదీ తెలుసుకోవడం గూడా సాధ్యంకాకుండా వుంది. మౌంట్‌బాటెన్ జూన్‌లో కాశ్మీర్ సంస్థానానికి వెళ్లినప్పుడు, ఏదో ఒక అధినివేశంలో చేరడం యొక్క ఆవశ్యకతనుగూర్చి ఎంతో గట్టిగా చెప్పవచ్చో, అంత గట్టిగాను మహారాజాకు నచ్చచెప్పడానికి ప్రయత్నం చేశారు. ఇది ఆగస్టు 15 లోపలనే జరగడం మంచిదని, మరి ఈ చేరడంలో గూడా ఏదో ఒకవిధమైన ప్రజాభిమతం గూడా ఆధారం చేస్తే ఇంకా బాగుంటుందని మౌంట్‌బాటెన్ మహారాజాకు సూచించినారుగూడా వున్నారు. ఇదంతా జూన్ నాటి సంగతి.

దీనికి పోనకంకా, మహారాజా అట్లాచేస్తే, పటేల్ ఏమనుకుంటాడో అన్న విషయం గూడా మహారాజా దృష్టికి తీసుకురాబడింది. ఆ చెప్పే అధికారాన్ని గూడా మౌంట్‌బాటెన్‌కు ఇచ్చిన కారణంగా, ఆయనే స్వయంగా పటేల్ అభిప్రాయం ఎట్లావుండేది మహారాజాకు తెలియజెప్పారు. దేశం విభజన అయి, అధికారం దత్తం అయ్యేలోపలనే మహారాజా ఇష్టపడి పాకిస్థాన్‌లో చేరదలచుకొని, పాకిస్థాన్ రాజ్యాంగ పరిషత్తులో పాల్గొనదలచుకొని, అట్టి నిశ్చయం చేసుకొన్నట్లయితే ఇండియా అందుకు ఎంత మాత్రం అభ్యంతరాన్ని చెప్పదు; అట్టి చర్యను స్నేహవిరుద్ధమైన దానినిగా భావించదు. అని మహారాజాతో చెప్పవలసిందిగా పటేల్ మౌంట్‌బాటెన్‌కు అధికారాన్ని ఇచ్చివున్నారు. అందువల్ల మౌంట్‌బాటెన్ మహారాజాకు ఈ సంగతి సందర్భాలన్నీ వివరించి: "నీ సంస్థానం ఉపద్రవంలో పడితే, అందుకు ఒక్కటే కారణం, అది నీ అకించనత్వం." అని హెచ్చరించి గూడా వున్నారు. మహారాజాను ఆవేశించిన ఈ అస్థిరా స్థితి చిత్తాన్ని వాదం, కొంతవరకు ... అనండి, ఏకపెం ఎందుకన్న భావం అనండి, పాకిస్థానను లేకపోవడం, ఈ రెండు ఒనగూడితే కాశ్మీర్‌లో ఇప్పుడు ఏర్పడివున్న ఈ పరిస్థితికి ప్రోదిచేశాయి. ఇంకోవిశేషం ఏమిటంటే, ఈవిధంగా కొండజాతి మూకలువచ్చి, తన రాజధానిమీద పడబోతున్నారన్నప్పుడుగాని, మహారాజాకు ఏదో ఒక అధినివేశంలో చేరక తప్పదన్న భావం కల్గిందికాదు. ఆయనకు ఈ భావం కల్గడానికి ఆ దండయాత్రే కారణం అయివుండవచ్చు.

### కాశ్మీర్ చేరిక—న్యాయాన్యాయాలు

కాశ్మీర్‌కు సైన్యసహాయం పంపేముందు ఇండియాలో ఆ సంస్థానం చేరికను అంగీకరించడంలో నేమి, అదికాక, సంస్థానంలో జనవాక్య నిర్ధారణద్వారా, దాని భవిష్యత్తు ఏమిటో తేలేదాకా, ఈ చేరిక రూఢికాదని; అంతవరకున్నూ ఈ ఏర్పాటు తాత్కాలికంగా చెల్లుబడి అవుతుంది అని తానై ప్రకటించడంలో నేమి, భారతప్రభుత్వం సమగ్రంగా ధర్మవిహితంగా వ్యవహరించిందనే నా విశ్వాసం. అయితే, బ్రిటిషు ప్రభుత్వం విధానాన్ని బట్టి చూచినా, జిన్నా విధానాన్ని బట్టి చూచినా, కాశ్మీర్ ఈ చేరిక న్యాయబద్ధంకాదనడానికి ఎవ్వరికీ వీలులేదు. ఆ విధానాల ప్రకారం కాశ్మీర్ యీ చేరిక పూర్తిగా చట్టబద్ధం అయినదేనని స్పష్టంగా చెప్పవలసివుంది. ఇక కాశ్మీర్ సమస్య ఏ విధంగా పరిష్కార సాధ్యంకాకుండాపోయివుండేది, అట్టి పరిస్థితి ఏర్పడకుండా ఎట్లా సాధ్యమైందీ అక్టోబరు 27 అర్ధరాత్రివేళ కాశ్మీర్ దండయాత్రకు గాను జిన్నా హఠాత్తుగా జారీ చేసిన ఉత్తర్వును చూచినా, ఆ ఉత్తర్వు అమలు జరగకుండా వుండడానికి జనరల్ గ్రేసీ వేసిన యెత్తును చూచినా తెలిసిపోతుంది. జిన్నా ఇచ్చిన ఆ ఉత్తర్వును తాను పాలించడం అంటూ జరగాలంటే, దానినిముందుగా అకిన్‌లెక్‌కు పంపాలని, ఆయన అనుజ్ఞమీదగాని ఆ ఉత్తర్వు పాలింపబడదని జనరల్ గ్రేసీ జిన్నాకు స్పష్టంగా తెలియజేశారు. అకిన్‌లెక్ ఆ ఉత్తర్వును రద్దుచేశారు. ఈ విధంగా అకిన్‌లెక్ చేయి చేసుకోవడంవల్ల జిన్నాకుమళ్లీ ఇంకోసారి సంగతి సందర్భాల నన్నింటిని ఆలోచించుకొనే సావకాశం లభించింది. ఈ విధంగా తమ ముఖ్య యుద్ధంఅంటూ ఏర్పడకుండా ఇండియా పాకిస్థాన్‌లు రెండూ సంరక్షింపబడినాయి.

### హైదరాబాదు సమస్య

యథాస్థితి ఒడంబడికపట్ల అనుకూలమైన నిర్ణయాన్ని అవలంబించేముందు, కాశ్మీర్ వ్యవహారం ఏవిధంగా పర్యవసిస్తుందో చూద్దామనే నిజాం నిజంగా కాలయాపనకు దిగాడు. ఈ కాలయాపనకోసమే ఆయన ఏవో ఆసామూషీ రాయబారాలు జరుపుతూ వచ్చారు. ఈ లోపల ఆయన స్వయంగా సృష్టించి పోషించుకుంటూ వచ్చిన ఇత్తేహాదుల్ ముస్లిమీన్ సంస్థ రాక్షస పరివేషాన్ని ధరించివేసింది. ఇండియాతో ఎవిధమైన ఒప్పందమూ పనికిరాదని ప్రాదుర్భవించిన ఈ ప్రతిపక్షాన్ని శాసించగల రాజకీయదార్ఢ్యంగాని, నైతిక సంపత్తిగాని, నిజాం నవాబుకు వున్నదా, లేదా అన్న అనుమానాలమధ్య ఈ విషయం అంతా ఊగులాడిపోతున్నది. ఈ సమస్య సవ్యంగా పరిష్కారం అయిపోయినా, ఇక గండాన్ని గడిచినట్లుపడ నేనల మనే నావిశ్వాసం.

నవంబరు 1 వ తేదీనాడు లాహోరులో జరిగిన సమాలోచనల సందర్భంలో జిన్నా మౌంట్‌బాటెన్‌తో జునాఘడ్ విషయమై గూడా ఏకైదు. జునాఘడ్ చేరికను ఆమోదించడం మొదట తనకు ఎంతమాత్రం ఇష్టంలేదని, అందుచేతే అదివిషయంలో పట్టుదల చూపించి, ఆఖరికి నవాబు, నవాబు దివాను పెట్టిన పెద్దేనిఒలవంతాలకు లొంగిమాత్రమే తాను ఆ చేరికను ఆమోదించానని ఆయన మౌంట్‌బాటెన్‌తో అప్పుడు అన్నారు. అయితే ఈసమావేశం ఇంకా ఒక నెల రోజులు జరగకముందుగా లియాఖత్ ఢిల్లీలో మళ్ళా జునాఘడ్ సమస్యను గూర్చి చేసిన ప్రస్తావనకు, ఇప్పుడు జిన్నా చేస్తున్న ప్రస్తావనకు ఏమీ సంబంధం లేదు. ఢిల్లీలో లియాఖత్ సైఖరి దీనికన్నా వేరుగావుంది అయిన ఇప్పుడు జిన్నా అన్నటువంటిమాట లేమి అప్పుడు అనలేదు. జునాఘడ్ చేరికను ఆమోదించడంలో ఉద్దేశం ఎట్టిదైనా కావచ్చు; అందుకు ఏట్టికారణాలనన్నా చూపవచ్చు; ఏమిచేస్తే ఏమి, ఇందువల్ల జిన్నా తీవ్ర ప్రతిరోధాన్ని తానై స్వయంగా ఆహ్వానించుకున్నట్లే అయింది.

### జునాఘడ్ ఉదంతం

జునాగఢ్ విషయమై పాకిస్థాన్ విసిరిన సవాలును పటేల్ స్వీకరించి, ప్రతిరోధించిన పద్ధతి, ఇచ్చట భారతదేశంలో సైతికోద్దీపనానికి పోషకంగా వుండేదిగావున్నా, బయటి ప్రపంచం అభిప్రాయాలను గూడా తనకు అనుకూలంగా దిద్దుకున్నాయన్న ట్టిదిగా మాత్రం లేదు. వర్తమాన విగ్రహీయ చరిత్రను చూసి ఇట్టి ఆక్రమణను సమర్థించుకోగల్గడం అన్నది అంత సాధ్యంకాకపోయినా ఇండియా ప్రభుత్వం ఈ విషయంలో న్యాయమాత్రాలకువిరుద్ధంగా నడిచిందనడానికిగూడా వీలులేదు. నవాబు సంస్థానంలో లేనప్పుడు, సంస్థానందివాను పరిపాలనా వ్యవహారాన్ని చూడవలసిందిగా భారతప్రభుత్వాన్ని కోరివుండటానికి, ఈ సంస్థానం చేరికను గూర్చిన సమస్యకు ఏమీ సంబంధంలేదని భారత ప్రభుత్వం భావించడం గమనించదగిన విషయం. నెహ్రూ ఈ విషయాన్నంతా సాకల్యంగా పాకిస్థాన్‌తో చర్చించాలని ప్రయత్నించే శారు గాని, సంస్థానంలో నవాబు పరిపాలన ఏర్పడేదాకా అట్టి సమాలోచనలు ప్రారంభం కావడానికే వీలు లేదని పాకిస్థాన్ ప్రభుత్వం అభిప్రాయపడింది. జునాగఢ్‌లో ఇండియా సేనలు ప్రవేశించాయంటే, అవి నవాబు ప్రభుత్వం అనుమతితోనే ప్రవేశించాయి గాని, మరొకరి ప్రమేయం అందులో ఏమీ లేదని ఇండియా వాదించింది. ఇదంతా ఈ విధంగాపోతే ఒకవంక గందరగోళంలోకి, మరోవంక ప్రచారపు టడుసులోకి దారితీస్తుంది. మరి ఈ గందరగోళంలో పడిపోయినా, ఆ అడుసులో చిక్కుకున్నా జరిగేదేమీ లేదు. వాటి ఛాయకు పోకుండా వుండటమే ముఖ్యం.

ఈ విధంగా అన్ని ముఖ్య విషయాలను సింహావలోకనం చేసినట్లయితే, కాశ్మీర్, హైదరాబాద్, జునాఘడ్ సమస్యలకు ఒండొంటితో సంబంధం వున్నదని, ఇందులో దేనిని కదిపినా, తీగను కదిపితే డొంక అంతా కదిలిన విధంగా అన్నీ కదులుతాయని రూఢి అవుతుంది. ఇందులో ఏ ఒక్క సంస్థానం సమస్య తేలినా, తక్కిన రెండు సంస్థానాలలోను పరిస్థితులు చక్కబడిపోయే సావకాశం వుంది. సంస్థానాలచేరిక అన్న దానిస్వరూపం ఏమిటో చక్కగా ఇప్పటికే అవిష్కృతమై వుంది. ఈ చేరిన సంస్థానాలన్ని ధృతికల్గి వున్నాయి. ఇక తగాదాలకు దారితీసే మూడు సంస్థానాల సంగతి విచారిస్తే ప్రజలు అధిక సంఖ్యాకులు ఒకమతం వారైతే, అధిపతి మరో మతానికి చెందిన వాడైవున్న సంస్థానాల విషయంలోనే ఇట్టి తగాదాలు ఏర్పడినట్లు వ్యక్తం అవుతుంది. వల్లభాయి పటేలు, లార్డు మౌంటు బాటెనూ, ఈ ఇద్దరు, ఈ సంస్థానాల చేరిక విషయమై పట్టుదల వహించి పని చేయకపోతే, ఇండియాలో విలయం తాండవించి వుండేది. అధికార దత్తతకు పూర్వం బ్రిటిషు ఇండియాకన్నా వేరుగా వుంటూ వచ్చిన ఈ స్వదేశ సంస్థానాల సమీకరణం పెద్ద ఎన్నువ అద్భుతావహంగా కొనసాగిందనే చెప్పాలి. అవి ఇప్పుడు ఇండియాలో చేరాయంటే పాకిస్థాన్‌గా విడిపోయినా నేలలకన్నా ఎక్కువ నేలలు, పాకిస్థాన్‌లో జనంకన్నా ఎక్కువ జనం ఇండియన్ యూనియన్‌లో చేరడం జరిగిందని అర్థం.

### చర్చిల్ అసందర్భ ప్రలాపాలు

బర్మాకు స్వాతంత్ర్య ప్రసాదనాన్ని గూర్చి, పంజాబు ఉదంతాలను గూర్చి మాట్లాడుతూ ఈమధ్య పార్లమెంటులో చర్చిల్ చేసిన ప్రసంగాల మూలంగా తిరిగి ... భావాలు తలెత్తాయి. చర్చిల్ ఈ ఉపన్యాసాలను సవాలు చేయకుండా పాగిపోనీయడం ఎంతమాత్రం, యోగ్యంకాదని నాయుటుక్కు నాకే తట్టింది. ఆ సవాలు స్వరూపం ఇది. (ఒకటి) సంబాలు అల్లరులలో ప్రాణాలుకోల్పోయిన వారిని గూర్చి ఆయన ఇచ్చిన అంకెలకు అతిశయోక్తి దోషం పట్టింది. మేము ఇక్కడ ఏదో లెక్కలు అన్నబురదలో పడి కొట్టుకుంటున్నట్లు ఆయన భావించారు. అదినిజమే. అయితే, మాకు అందనంత పట్టు, ఆయన పార్లమెంటులో ఇచ్చిన ప్రాణ్నాంకాలలో సత్యం అన్నది పూర్ణానుస్వారంగా కన్పిస్తున్నది. (రెండు) బర్మాను గూర్చి ఆయన మాట్లాడినదాంట్లో, స్వాతంత్ర్యానికీ, అధినివేశ ప్రతిపత్తికీ భేదం ఎంచబడింది. స్వాతంత్ర్యంకన్నా, అధినివేశ ప్రతిపత్తి తక్కువన్నాయిలో నిదని ఆయన వాదము గా తోస్తున్నది. దీనినిఖండించడానికి వెంటనే బ్రిటిష్ ప్రభుత్వం పూనుకోవలసి వుంది. రాజకీయంగా గాని, న్యాయశాస్త్రరీత్యా గాని అట్లా వాదించేందుకు ఆధారం లేదని స్పష్టం చెయ్యాలి. ఏది ఏమైనా తాము అనుసరిస్తున్న విధానంమాత్రం చర్చిల్ చెబుతున్న విధానం వంటిది మాత్రం కాదని ప్రకటించవలసిన అవసరం కన్పిస్తున్నది.

ఇండియా ఇప్పుడిప్పుడే కామన్‌వెల్తును వదలి బయటపడదన్న భావం నాకు మొదటినుంచీ వుంది. ఇప్పుడు లండనునుంచి తిరిగివచ్చిన అనంతరం ఆభావం మరింత బలపడింది. ఇందుకు తగిన ఉపాయం మాత్రం వారికి కనుపించాలి. అది కనుపించిందా, ఆ విషయాన్ని అట్లాగేవుంచివేస్తారు. కొంతకాలంగా నాలో ఒక అనుమానం బలుస్తున్నది. జిన్నా వున్నాడే అతడు ఈ కామన్‌వెల్తు సమస్యను బొయ్యిమీద నీళ్లను కాచినట్లు కాచారని, అట్లా ఇండియాను కామన్‌వెల్తులోంచి బయటపడేటట్టు చూచి, తాను ఒక్కడు తన పాకిస్థానుతో సహా అందులో వుండి, దానికి భారతవర్షంలో, ఉత్తర పర్వంతు, ప్రతిపత్తిని సాధిద్దామని ఈ ఆలోచనలో పడి కొట్టుకుంటున్నట్లు తోస్తున్నది. అయితే జిన్నా ఈ ఎత్తుసాగేదాక అంత తేలిక అయినవిషయం కాదు. ఎందుచేతనంటే రాజుగారికి మౌంట్‌బాటెన్ అతి సన్నిహితుడైన బంధువు. ఆయన గవర్నర్ జనరల్ హోదాలో ఇండియాలోవుంటున్నాడు. అందువల్ల జిన్నాకు ఈ ఎత్తుముందుకు సాగదీయడానికి తగిన వీర్లు కన్పించకుండా పోతున్నవి.

ఏది ఎట్లావున్నా, కరాచీప్రచారాలకు మౌంట్‌బాటెన్ లక్ష్యభూతుడు కాబోతున్నాడని చెప్పడానికి ఉపోద్బలకమైన సాక్ష్యం పెరిగిపోతున్నది. ఇందుకు ఉదాహరణగా నేడు పాకిస్థాన్ టైమ్సు పత్రిక మౌంట్‌బాటెన్ స్వయంగా కాశ్మీర్ యుద్ధాన్ని నడిపిస్తున్నట్లు ఆరోపణలు చేస్తూ ఒక వ్యాసాన్ని ప్రకటించింది. అప్పుడే మౌంట్‌బాటెన్ రాజుగారి అమ్మాయి పెళ్ళికిగాను లండన్ వెళ్ళారు. ఇంతకన్నా ఈ అసంగత ప్రచారాన్ని ఖండించడానికి వేరే ఏమీ అవసరం లేదు: అయినా సామెత చెప్పినట్లు, అబద్ధం ఎంతబాగా ఆడితే, అంతబాగా దాని విలువ పెరుగుతూ వుంటుంది. ఇక ఇట్టి అబద్ధాలనుఖండించడం అంటూ పెట్టుకుంటే, అది నిజమే నేమోనన్న అనుమానానికి గూడా దోహదం ఇచ్చినట్లే అవుతుంది.

## 'వినయ భవన' ప్రారంభోత్సవం

### మౌలానా అబుల్ కలాం ఆజాద్ ఉపోద్ఘాతం

శాంతినికేతనం, సెప్టెంబరు 23: మౌలానా అబుల్ కలాం ఆజాద్ గారు నేటిదినం 'వినయ భవనా'నికి ప్రారంభోత్సవం జరిపారు.

విశ్వభారతికి కేంద్ర విశ్వవిద్యాలయంగావచ్చిన కొత్త అంతస్తుకు అనుగుణంగా వినయ భవనం ఈ యేడాదినుంచి ఉపాధ్యాయులకు శిక్షణనిచ్చే డిగ్రీ కళాశాలగా మార్చబడింది.

యీ కళాశాలను ప్రారంభిస్తూ ఆజాద్ గారు ఇలా చెప్పారు: "గురుదేవుడైన రవీంద్రనాథుని దివ్యస్మృతి తోనూ, స్మారకలలోనూ విరారందరు మహోన్నతంగా ఎత్తిపట్టుకున్న దివ్యమైన విద్యాజ్యోతి నుంచి తమ దీపాలను వెలిగించుకోవడానికై యావద్భారత దేశంనుంచే కాదు; యావత్ప్రపంచం నుంచీకూడా ఎందరెందరో విద్యార్థులు, ఉపాధ్యాయులూ ఇక్కడికి వస్తారు. ఆ దివ్యజ్యోతి నిత్య జాజ్వల్యమానంగా వెలుగొందు గాక. ఇక్కడి నుంచి వెళ్ళిపోయే ఉపాధ్యాయులు ఇక్కడ తాము పొందిన శిక్షణతో నిత్యోత్తేజానికి ఆకర మవుదురు గాక!"

## పాకిస్తాను ప్రచారం

న్యూఢిల్లీ, సెప్టెంబరు 23: భారత ప్రభుత్వం ముస్లిలను నానాఅవస్థలు పెడుతున్నదంటూ పాకిస్థాన్ పత్రికలు ఈమధ్య మరింతతీవ్రంగా ప్రచారం సాగిస్తున్నాయి. డా॥ గ్రాహాంని వేదికను చర్చించడానికి భద్రతామండలి కొద్దిరోజుల్లోనే సమావేశం కాబోతున్నది. ఆ సమావేశంలో పాకిస్థాన్ ప్రతినిధులు చేయబోయే నిందారోపణలకు ఉపోద్ఘాతంగా యీ దుష్ప్రచారం ప్రారంభించ బడిందని విషయజ్ఞులు వ్యాఖ్యానిస్తున్నారు. పాకిస్థాన్ పత్రికలు క్రిందటిసారి గూడా భద్రతామండలి సమావేశం అయేముందు సరిగా ఇలాగే ప్రచారంచేశాయి. డా॥ గ్రాహాంకు భారతీయ ముస్లిం నాయకులు సమర్పించిన నివేదిక సంగతి మరపించాలన్న తాపత్రయం కూడా ఇందుకు కొంత కారణం అయివుండవచ్చు. "ఇండియాలో ముస్లిం అల్పసంఖ్యాకవర్గం పడుతున్న యాతనలు" అనే శీర్షికతో రెండువారాల క్రిందట పాకిస్థాన్ పత్రికలన్నీ తమలో తాము కూడబలుక్కున్నట్లుగా ఏకకాలంలో ఒక పెద్ద వ్యాసాన్ని ప్రకటించాయి. "భారతదేశంలోని 4 కోట్ల మంది ముస్లింలు ఈనాడు నానాదురవస్థలు పడుతున్నారంటే, అది నిజానికి వారికేగాదు లోకానికి గూడా ఒక అగ్నిపరీక్ష. ఐక్యరాజ్యసమితియొక్క శక్తిసామర్థ్యాలు ఏపాటివో తేలిపోయే పరీక్షాసమయం ఆసన్నమైంది" అని ఆ వ్యాసంలో ప్రకటించబడింది.

## హిందూమతాదాయాలకమిషనర్

మద్రాసు, సెప్టెంబరు 24: హిందు మతాదాయాల మార్పి చట్టంక్రింద చిన్నయ్యపిళ్లెగారు కమిషనరుగా నియమింపబడ్డారనీ, మున్నడి నాయర్‌గారు డిప్యూటీ కమిషనరుగా నియమింపబడ్డారనీ తెలుస్తోంది.

## సంపాదకునకు లేఖలు

### విజయవాడ-రాజమండ్రి ఎలక్ట్రిక్ లైను

ఆర్యా, విజయవాడనుండి రాజమండ్రికి డెల్టాప్రాంతంమీదుగా విద్యుత్ సరఫరా చేయటానికి అదనపు వ్యయంతో ఒక ప్లానుకి అనుకూలజనపర్తో వున్నారు. ఏలూరునుంచి కొవ్వూరు వరకు వున్న ఒక రోడ్డు ఏజన్సీలో వున్నది. దీని పొడవు 70 మైళ్లు. యీ ప్రాంతంలో ప్రభుత్వం తామే ఎట్టి సదుపాయాలు చేయక పోయినా, అక్కడ వున్న వాలును, అయిదు లక్షలనుంచి తామే కష్టపడి ఆ ప్రాంతాన్ని సేద్యానికి అనుకూలంగా చేసుకొన్నారు. ఇప్పుడు ప్రభుత్వం వేయదలచిన లైను ఏలూరునుంచి కొవ్వూరుకు సమరాకాంలో ముండూరు, కొమరవరప్రోలు, జంగారెడ్డిగూడెం, గోపాలపురం, కొయ్యలగూడెం, తాళ్లపూడి, మేరేశ్వరపురం, దొమ్మేరు, మలకపల్లి గ్రామాలమీదుగా వేస్తే, ఆ ఏజెన్సీ ప్రాంతానికి వరప్రసాదము కాగలదు. డెల్టాప్రాంతాలలోనూ, పట్నాలలోనూ వసే యీలైనువిలునాటికి ఉపయోగిస్తుందికాని ఏజెన్సీనుండా వేస్తే లైను సన్యా. వృద్ధికి దోహదమీయగలదు.

మంగిపూడి ఫురుష్ త్తం

* * *

### గుడివాడలో పంచదార పంపిణీ

ఆర్యా, దాపులో వున్న బందరు, బెజవాడ బస్తీలలో, పంచదార పంపకం సక్రమముగా జరుగుతున్నప్పటికీ, గుడివాడలోని పరిస్థితి చాలా అధ్వాన్నముగా వున్నదని చెప్పక తప్పదు. గత జూన్, జూలై నెలల్లో, కలుసుబడి ఉన్నవారికి ప్రత్యేక పర్మిట్లమీద తప్పితే, సామాన్య ప్రజానీకానికి మందులోకికూడ పంచదార దొరకలేదు. తమ పత్రిక సంపాదకీయము ద్వారా స్థానిక విలేఖరుల వార్తల ద్వారా యీపరిస్థితిని ప్రభుత్వదృష్టికి తీసికొనివచ్చినా, స్థానిక ప్రభుత్వోద్యోగులు మటుకు బాధ్యత వహించి నిర్ణీతకాలములో పంపకానికి ఏర్పాటు చేయలేదు. యీయాష్యరమునుంచి, పంచదార తెచ్చి, వీశ 1 కి 2-12 [illegible] 0-చొప్పున బాహాటముగా [illegible] న్నారు. 2 నెలలనుంచి పంచదార పంపకం లేకపోవటం కారణంగా ఎంత ఖరీదయినా పెట్టి హోటళ్లవాళ్లు తమ వ్యాపారావసరం కోసము కొనటం వల్ల సామాన్య ప్రజానీకము అవసరమునకు అంత ఖరీదుపెట్టినా దొరకక చాలా యిబ్బంది పడుతున్నారు. జీవితావసర వస్తువులనయినా సకాలంలో సక్రమంగా పంపకం చేసేవిర్పాటు ప్రభుత్వము యికనుంచి అయినా చేయగలదని విశ్వసిస్తున్నాము.

గుడివాడ: ఒకపౌరుడు

### బరంపురంలో చక్కెర కొరత తీరిందా?

ఆర్యా, ఇటీవల వచ్చిన పత్రికలలో వార్తలనుబట్టిచూస్తే చక్కెర కరువు లేదనిపిస్తున్నది. కానీ బరంపురంలోమాత్రం రెండు నెలలుగా చక్కెర కరువు చాలా హెచ్చుగా వున్నది. అందరికీ అర్ధకోటాలు మాత్రమే యిస్తున్నారు. ఇంతేకాకుండా—స్వేచ్ఛా వ్యాపారులవద్ద నుండి పర్మిట్లు లేకుండానే ప్రజలు చక్కెర దిగుమతి చేయించుకోవచ్చునని భారత ప్రభుత్వం ప్రకటించి వున్నా, ఒక్కఒరిస్సా రాష్ట్రప్రభుత్వంమాత్రం పర్మిట్లు లేకుండా చక్కెర దిగుమతి చేసుకోనివ్వటంలేదు. పోనీ, దరఖాస్తులు పెట్టుకొన్న వారికైనా ఎన్నిసార్లు పునర్విజ్ఞప్తులు పంపుకొన్నా, పర్మిట్లు యీయుటంలేదు. అందరికీ పూర్తికోటా యిచ్చేందుకు కావలసిన చక్కెర తాము తెప్పించక, తామే తెప్పించుకొ[illegible] వ్యాపారులకు పర్మిట్లు [illegible] యివ్వక ప్రభుత్వం ప్ర[illegible] రంగా బాధలపాలుచేస్తున్నది. ఇప్పటికైనా తమ శ్రద్ధ తీసుకోగలందులకు ప్రభుత్వాధికారులనుకోరుచున్నాను.

సత్యనారాయణమూర్తి, బరంపురం.

### జనుముపంటపై శ్రీకాకుళం జిల్లాబోర్డు పన్ను

ఆర్యా, శ్రీకాకుళం జిల్లాబోర్డువారు జనుముపంట లైసెన్సు రుసుము పేరను ప్రతి రైతునుండి రు. 15-0-0లు చొ॥ న, సుంకము వసూలు చేస్తున్నారు. మద్రాసు, లోకలుబోర్డు చట్టం 193 సెక్షను, షెడ్యూలు VII క్లాజు 'O' క్రింద యిట్టి సుంకం విధింపబడినట్లు కనిపిస్తున్నది. ఈ సెక్షను సూక్ష్మంగా పరిశీలిస్తే యీ సుంకము వసూలుచేసే అధికారం జిల్లాబోర్డుకు లేనట్లు తేలుతున్నది. అంతేకాక అది గ్రామనివాసస్థల పరిమితిలో ఆరోగ్యంకొరకు సుంకముల విధింపుకు అవకాశమును వూహించి చేయబడిన సెక్షనై యున్నది. వ్యవసాయమునకు వ్యవసాయపంటలకు సంబంధించి ఎంతవరకు సుంకము విధింపుకు సెక్షనులో యెట్టి అవకాశము కనబడుట లేదు. చిరకాలంనుండి జనప నార రైతులు పండిస్తున్నారు. ఎచ్చటలేనిది శ్రీకాకుళం జిల్లాబోర్డుకే ఈ వసూలరణ పద్ధతి కనబడెది. ఇందుమూలమున గ్రామమునుండి ధీమావున్నకంటె అధికము వసూలవుతున్నది. ప్రజల ఆరోగ్యము కొరకు పారిశ్రామిక పనులకు పైపుస్తేంచబడిన సెక్షన్ అవకాశమును, పబ్బుకొరకు వ్యవసాయదారులపై సుంకముగా విధించుట అసందర్భం, అక్రమము, కాన జిల్లాబోర్డువారు దీనిని తొలగించాలి.

పార్వతీపురం,
చికటి సరి...రాం నాయుడు,
ఆంధ్ర ప్రజాపార్టీ కార్యవర్గసభ్యుడు.

# పారిశ్రామిక న్యాయస్థాన సభ్యుల రాజీనామా

## సమ్మె సంకల్ప విరమణకు అఖిలభారత బ్యాంకు ఉద్యోగుల సంఘ నిర్ణయం

జయపూరు, సెప్టెంబరు 23: బ్యాంకు వివాదాల పరిష్కారానికి నెలకొల్పిన పారిశ్రామిక న్యాయస్థానం అధ్యక్షుడు శ్రీ హెచ్. దివేతియా ఆయనతోడి ఇరువురు సభ్యులు శ్రీ ఎమ్. జి. మెత్రి శ్రీ బి. ఎన్ గంగూలీ రాజీనామాలు సమర్పించారు.

అందువల్ల ముగ్గురు స్వతంత్ర సభ్యులతో నూతన న్యాయస్థానం నెలకొల్పనున్నట్లు భారత ప్రభుత్వ కార్మికశాఖ ఈ రోజున అఖిలభారత బ్యాంకు పనివారల సంఘాధ్యక్షునకు శ్రీ జె. జె. మెహతాకు తెలియ పరిచినది.

బ్యాంకు యజమానులు, పనివారల మధ్య ఏర్పడిన తగాదాల పరిష్కారానికి దివేతియా ట్రిబ్యునల్ స్థానంలో ఒక న్యాయమూర్తి, ఉభయ పక్షాల ప్రతినిధులు సభ్యులుగా మరొక న్యాయస్థానం నియమించాలని కోరుతూ శ్రీ మెహతా ఈ వారం మొదట ప్రధాన మంత్రికీ, కార్మిక ఆర్థిక శాఖలకు తంతి వార్తలు పంపారు. దానికి సమాధానంగా కార్మికశాఖ పై విధంగా తెలియ పరిచినది.

ఉభయ పక్షాలవారికీ తనపట్ల సంపూర్ణమైన విశ్వాసంలేని కారణంచేత రాజీనామా సమర్పిస్తున్నట్లు శ్రీ దివేతియా భారత ప్రభుత్వానికి తెలియపరిచారట. దివేతియా ప్రభృతులు కొన్ని బ్యాంకులలో వాటాదార్లు అయిన కారణంచేత వారి నియామకం చెల్లదని వాదిస్తూ ఇరువురు బ్యాంకి పనివారు బొంబాయి హైకోర్టుకు ఒక దరఖాస్తు పెట్టుకున్నారు. వాటి పర్యవసానంగా న్యాయస్థానం నెలకొల్పుతూ ప్రభుత్వం జారీచేసిన ఈ ఉత్తర్వును ఏ కారణాలవల్ల రద్దు చేయకూడదో తెలియపరచ మంటూ హైకోర్టు ప్రభుత్వానికి, న్యాయస్థానానికి నోటీసు పంపినది.

బ్యాంకులలో వాటాలు ఉండడమే ఆయన రాజీనామాకు ప్రధాన కారణమట. అయితే దివేతియా న్యాయస్థానాన్ని బహిష్కరించడానికి, అక్టోబరు 1 వ తేదినుండి సమ్మె జరపడానికి అఖిలభారత బ్యాంకు పనివారి సంఘం ఇటీవల నిర్ణయించినది.

### సమ్మెనిర్ణయం రద్దు

అఖిలభారత బ్యాంకు పనివారి సంఘం నేడిక్కడ ప్రత్యేక సమావేశం జరిపి, అక్టోబరు 1 వ తేదినుండి సమ్మె జరపకుండా ఉండడానికి నిశ్చయించినది.

భారత ప్రభుత్వానికి కొన్ని, సూచనలు చేయడానికి, వాటిని ప్రభుత్వం నిరాకరించే పక్షంలో రెండు నెలలలోగా పరిస్థితిని పునః పరిశీలించి, అనుబంధ సంఘాలు జరుపవలసిన చర్యలు నిర్ణయించడానికి సంఘం ... కార్యాచరణ సంఘానికి అధికారం ఇచ్చినది.

